# కథా సంగ్రహం

సరోజ, వసంత అక్కా చెల్లెళ్ళు. ఆస్తి అంతస్తూ ఉన్న వాళ్ళ తండ్రి శ్రీపతి సరోజకి పెళ్ళి సంబంధాలు చూడటం మొదలుపెట్టాడు. అంద చందాల్లోనూ, గుణగణాల్లోనూ అక్కా చెల్లెళ్ళిద్దరూ ఒకరికొకరు తీసిపోరు. వాళ్ళ పెళ్ళి ఒక సమస్య అవుతుందని ఎవ్వరూ అనుకోలేదు. కాని సరోజకి ఏ పెళ్ళి సంబంధం మాట్లాడినా, పెళ్ళికొడుక్కిగాని, అతని వాళ్ళకిగాని, పెళ్ళి చూపుల ముందే ఏవో అపసవ్యాలు జరిగి ఆ సంబంధం తప్పిపోవడం మొదలైంది. ఇల్లా రెండు మూడు సంబంధాలు తప్పిపోయేసరికి ఆ అమ్మాయి దురదృష్టపు జాతకురాలు అని అపవాదు పడింది. వసంత మధు అనే ఒక ఇంజనీర్ని ప్రేమించింది. కాని అక్కయ్య పెళ్ళి జరిగేవరకూ తన ప్రేమ సంగతి పైకి చెప్ప దలుచుకోలేదు. శ్రీపతి తమ్ముడు ప్రొఫెసర్ రఘు ఢిల్లీ నుంచి వస్తాడు. బెంగతో, మనస్తాపంతో కుమిలి పోతున్న శ్రీపతిని, సరోజని చూసి వాళ్ళకి ధైర్యం చెప్పి, తనే ఒక మంచి సంబంధం కుదురుస్తాడు. సరోజ పెళ్ళి నిశ్చయం అవుతుంది.

గడ్డు రోజులు గడిచిపోయాయని అందరూ ఆనందంగా ఉండగా, పెళ్ళిరోజున పెళ్ళిపందిట్లో సరోజకి [illegible] వరుడు చనిపోతాడు. శ్రీపతికి గుండెపగిలినంత [illegible] మంచం పడతాడు. తను దురదృష్టవంతురాలనని తను బ్రతికుండగా తన చెల్లెలి పెళ్ళయినా జరగదని, ఏడుస్తూ వాళ్ళు [illegible] ఆవేశంలో మేడ మెట్లమీద నుండి పడిపోతుంది. సరోజ మతి చలిస్తుంది.

వసంత, మధు ప్రేమించుకున్నారని తెలుసుకున్న రఘు, ఆ ఇంట్లో ఒక శుభకార్యమైనా జరగాలని పట్టుబట్టి వసంతకి మధుతో పెళ్ళి జరిపిస్తాడు. ఆ తర్వాత ప్రొఫెసర్ రఘు ఉద్యోగరీత్యా విదేశాలకు వెళ్ళిపోతాడు. నానాటికీ దిగజారుతున్న సరోజ పరిస్థితి చూసి తట్టుకోలేక గుండె జబ్బుతో మరణిస్తాడు శ్రీపతి.

వసంత, అక్కయ్యని తీసుకుని భర్తకి బదిలీ అయిన పట్నం వెళుతుంది. సరోజకి ఎన్నో వైద్యాలు చేయిస్తారు. కాని లాభం వుండదు. సరోజకి పెళ్ళి చేస్తే బాగుపడుతుందని, బ్రతకవచ్చని ఆఖరి మాటగా చెప్తారు డాక్టర్లు.

కాని చూసి చూసి, ఆ పిచ్చి మనిషిని ఎవరు చేసుకుంటారు? చివరికి వసంత, తన అక్కగారి ప్రాణాలు నిలబెట్టడానికి, మధుని బలవంతం చేసి ఆ పెళ్ళికి ఒప్పిస్తుంది.

సరోజకు మధుకి పెళ్ళి జరుగుతుంది. విచిత్ర పరిస్థితుల్లో, కొద్ది రోజుల్లోనే సరోజ పూర్తిగా ఆరోగ్య వంతురాలవుతుంది. వసంతకి, మధుకి అంతకుముందే పెళ్ళి జరిగినట్లు ఆమెకి తెలియదు. ఆమెకి భర్తంటే జీవితం. చెల్లెలంటే ప్రాణం! కాని తన భర్త చెల్లెలి మీద మోజు పడుతున్నాడని అనుమానం కలుగుతుంది. చెల్లెలికి వెంటనే మంచి సంబంధం చూసి పెళ్ళి చెయ్యాలని సరోజ పట్టుబడుతుంది. మధు పరిస్థితి అడకత్తెరలో పోకచెక్కలా అవుతుంది. వసంతకి ఏం చెయ్యాలో తెలీదు.

తనకు, మధుకు అంతకుముందే పెళ్ళయిపోయిందని తెలిస్తే సరోజకి మళ్ళీ మతిపోతుందని భయం! చెప్పకపోతే తమ జీవితాలు నాశనమయిపోతాయి. ఇరకాటంలో పడి అల్లాడిపోతారు వసంత, మధు.

ఈ విచిత్రమైన విషమ పరిస్థితికి పరిష్కారం ఏమిటి? ... చివరికి వాళ్ళ జీవితాలు ఏమవుతాయి? ఉత్కంఠ రేకెత్తించే, ఈ వింత ప్రశ్నలకి సంపూర్ణ సమాధానాలు —

మా వెండితెరపై చూడండి!!

## పాట నెం. 2

రచన : ఆరుద్ర    పాడినవారు : సుశీల

పల్లవి : మేళతాళాలతో వేదమంత్రాలతో
జరిగే కళ్యాణ వైభోగమే
కన్నె తీగ సోముల కోటి విరి జల్లుల
కలలు పండగమదే

చరణం 1 నల కలల్లాడే కస్తూరి తిలకం
నమపెందు చేసే సింగారి అందం
పాపిడి రేఖల పాలుబడలో
సిగ్గుల్లొలికే బుగ్గ చుక్కతో
మనసార చేయాలి గౌరీపూజ.
ఆ తల్లి ఇవ్వాలి సౌభాగ్య శోభ. ॥మేళ॥

చరణం 2 కల్యాణ సాక్షి దివ్యాగ్ని హోత్రం
వర్యానుబంధం – మంగళసూత్రం
మూడు ముడుల రాగబంధం
ఏడు అడుగుల జీవనమార్గం
వేస్తారు పెద్దలు అక్షింతలు
దీవనలు కావాలి అక్షింతలు. ॥మేళ॥

చరణం 3 తెలిసీ తెలియని వలపుల తలపులు
విరిసీ విరియని విరజాజిపూలు
అందచందాలు శ్రీవారికి
అంకిత మియ్యాలి ఈ శుభవేళ
మరలా రానిది ఈ తొలిరేయి
మధురము కావాలి ఈనాటి హాయి.

## పాట నెం. 3

రచన : శ్రీ కొసరాజు.    పాడినది : పి. సుశీల. బాలసుబ్రహ్మణ్యం. బృందం.

పల్లవి : కన్నెపడుచులంత కలిసి కట్టి తెరచాటేసెను
ఓరి దేవుడో

బృందం : కందుకూరు చిన్నదాన్ని
కంటిలోగ కుట్టింది ఓరి దేవుడో

మంత్రేసి చిన్నవాడు
మాటలోనె పడ్డాడు ఓరి దేవుడో
చెప్పకుండ చెయ్యకుండ
సొమ్ముమాయమయింది ఓరి దేవుడో

చరణం 1

అతడు : బంతిపూవులాగున్నది ఓరబ్బో
పట్టుకుంటె కందిపోతది ఓరబ్బో
వెంట వెంట బడతాది / కంటిసైగ చేస్తాది
దీని తస్సదియ్యా

ఆమె : ఒంగోలు చిన్నవాడు ఓరబ్బో
ఉంగరాలు జుట్టువాడు ఓరబ్బో
పట్టుబాద పడ్డానా అమ్మొమ్మొమ్మో
పట్టుపంచె వదలి పెట్టడూ
పీడిసిమ్మదియ్యా ॥చిన్నా॥

చరణం 2

అతడు : ముసి ముసి నవ్వులు నవ్వింది
ముద్దులియ్యమని అడిగింది
పండు దూసుకుని సరసాలాడుతు
చక్కిలిగింతలు పెట్టింది -
చక్కిలిగింతలు పెట్టింది

ఆమె : చిలిపి చూపుల బుల్లోడు
వలపు వన్నెలని అన్నాడూ
సిగ్గెందుకు నీ కన్నాడూ
బుగ్గపట్టుకుని గిల్లాడూ -
బుగ్గపట్టుకుని గిల్లాడు. ॥చిన్నా॥

చరణం 3

ఆమె : ఒంటరిగా నను చూశాడు
ఒంటి పైన చెయి వేశాడు
చక్కని చుక్కవు అన్నాడు
చిక్కని కౌగిలి యిచ్చాడు -
చిక్కని కౌగిలి యిచ్చాడు

అతడు : దొండ పండులా వున్నది
కోర వయసుగల చిన్నది
తియ్యని పెదవుల తేనెలు యిచ్చి

## నటీనటవర్గం :

| | |
|---|---|
| రామకృష్ణ | చంద్రకళ |
| రాజబాబు | ప్రభ |
| చంద్రమోహన్ | రాజేశ్వరి |

రమణమూర్తి, జగ్గయ్య, మాస్టర్ బిడిగి,
బేబీ అనిత, జయమాలిని.

## అతిథి నటులు :

నాగభూషణం, అల్లు రామలింగయ్య, పుష్పకుమారి.
స్పెషల్ అపియరెన్సు : ఈశ్వరరావు.

---

ఆంధ్ర : శ్రీ ధనలక్ష్మి పిక్చర్సు
విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలకు
శ్రీ పద్మా పిక్చర్సు, విశాఖపట్నం.

## సాంకేతిక నిపుణులు :

| | | |
|---|---|---|
| డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ | } | యస్. వెంకటరత్నం |
| మాటలు | : | భమిడిపాటి రాధాకృష్ణ |
| పాటలు | : | ఆరుద్ర - సినారె - కొసరాజు వేటూరి, సుందరరామమూర్తి |
| సంగీతం | : | చక్రవర్తి |
| నేపథ్యం | : | యస్. పి. బాలసుబ్రహ్మణ్యం, సుశీల - వాణీజయరాం |
| కళ | : | తోట |
| నృత్యములు | : | శ్రీనివాస్ |
| లేబరేటరీ | : | A. V. M. |
| పాటలు రికార్డింగ్ అండ్ రీ రికార్డింగ్ | } | P. V. కోటేశ్వరరావు |